

భగవద్రామానుజులు - శ్రీపెరుంబూదూరు

శ్రీ యతీంద్రప్రవణకైంకర్యసభ (హైదరాబాదు) - ప్రథమపుష్పము

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ పిళ్లైలోకమ్ జీయర్ అనుగ్రహించిన

# శెయ్యతామరైత్తాళిణైవ్యాఖ్యానము

(శ్రీవరవరమునుల మంగళాశాసనపాశురవ్యాఖ్య)

ఆంధ్రానువాదసహితము

అనువాదము

ఉ॥వే॥శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు



పరిష్కరణము

న్యాయవేదాంతవిద్వాన్

ఉ॥వే॥శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు

శ్రీ యతీంద్రప్రవణకైంకర్యసభ (హైదరాబాదు) – ప్రథమపుష్పము

శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ పిళ్లైలోకమ్ జీయర్ అనుగ్రహించిన

# శెయ్యతామరైత్తాళిణైవ్యాఖ్యానము

## (శ్రీవరవరమునుల మంగళాశాసనపాశురవ్యాఖ్య)
## ఆంధ్రానువాదసహితము

అనువాదము

ఉ॥వే॥శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు



పరిష్కరణము

న్యాయవేదాంతవిద్వాన్

ఉ॥వే॥శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు

శ్రీ యతీంద్రప్రవణకైంకర్యసభ (హైదరాబాదు)-ప్రథమపుష్పము

**శ్రీ పిళ్లైలోకమ్ జీయర్ అనుగ్రహించిన**

# శెయ్యతామరైత్తాళిణైవ్యాఖ్యానము

**(శ్రీవరవరమునుల మంగళాశాసనపాశురవ్యాఖ్య)**
**ఆంధ్రానువాదసహితము**

**అనువాదము**

**ఉ॥వే॥శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు**


ప్రథమముద్రణ :పార్థివ - ఆశ్వయుజము - మూల - 6 నవంబరు, 2005
ఆవిష్కరణము - శ్రీవరవరమునుల అవతారోత్సవ శుభ సందర్భముగా

ప్రతులు : 500

మూల్యము : రూ. 20/-





ప్రతులకు : 1. శ్రీమతి ఈ. జయలక్ష్మి
18-3-58/7, శాంతినగర్, కె.టి. రోడ్
తిరుపతి - 517 507 ఫోన్ : 0877 - 22232091
2. ఉ॥వే॥ శ్రీమాన్ ఐ. శ్రీరామాచార్యులు
23-12-4/6, శ్రీరామ్ నగర్, బాజీ స్ట్రీట్,
రామదాసు పార్కువద్ద, రాజమండ్రి, ఫోన్ : 0883-2467032

అక్షరయోజనము : **అన్నపూర్ణ గ్రాఫిక్స్ స్క్రీన్స్ & ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
53/4, ఆర్.ఎస్. గార్డెన్స్, తిరుపతి - 517 507,
ఫోన్ : 2235006 (0877)

ముద్రణ : ముగ్ధ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, దేవీచౌక్, రాజమండ్రి.
ఫోన్ : 0883-2463540




జై గోవింద ! శ్రీమతే రామానుజాయ నమః జైజై గోవింద !!





పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయరు స్వామివారు**

**శ్రీభాష్యకార సిద్ధాంత పీఠము**

SRI BHASYAKARA SIDDHANTA PEETHAM
Regd. No. 8/2000
1-4-2, Suryanarayanapuram, Near Addavantena, Juvvalapalem Road,
**BHIMAVARAM - 534 202.** W.G. Dt., A.P.

## మంగళాశాసనము

ప్రియ శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. సింగరాచార్యస్వామివార్కి

దేవరవారు **"శెయ్యతామరైత్తాళిణై"** వ్యాఖ్యకు అనువాదమును వ్రాసి పంపినారు. దానిని చూచి మేము చాలా సంతోషించినాము.

మహాపండితులైన ప్రతివాదిభయంకరం అణ్ణన్ స్వామివారు మణవాళమహామునుల తిరువడిని ఆశ్రయించి, వారియందలి ప్రీత్యతిశయముతో వారికి మంగళాశాసనమొనర్చుచూ అనుగ్రహించిన ఈ పాశురము మన శ్రీ వైష్ణవ ప్రముఖులందరూ గోష్ఠిలో అనుసంధించుట ప్రసిద్ధమై ఉన్నది. ఈ పాశురమునకు పరమకృపాళువులైన పిళ్ళైలోకమ్‌జీయర్ ఒక చక్కని వ్యాఖ్యను అనుగ్రహించియుండిరి. కాని లోకమున, మీదు మిక్కిలి మన ఆంధ్రప్రదేశమున, ఇటువంటి వ్యాఖ్యానములు అందుట మిక్కిలి దుర్లభమైనది. అందిననూ భాషా సమస్య. అటువంటి సమస్య లేకుండా మీవంటి పండితులు చక్కని అనువాదము చేసి అనర్ఘ రత్నాలను ఎన్నో లోకమునకు అందించుచున్నారు. ఇలాగే మరుగునపడిన అనేక ద్రావిడ వ్యాఖ్యానములకు అనువాదములు లోకమునకు అంది, శ్రీవైష్ణవ భక్తజనులు శ్రీ వైష్ణవ శ్రీని ఆస్వాదింతురుగాక!

అనేక మంగళాశాసనములతో

తేది : 8-10-05

**(శ్రీ రామచంద్రజీయర్)**

శ్రీమతే రామానుజాయ నమః

మహామహోపాధ్యాయ
శాస్త్రరత్నాకర, కవిశాబ్దికకేసరి
ఉభయవేదాంత మహావిద్వాన్

**ఉ.వే శ్రీమాన్ శ్రీ. న.చ.రఘునాథాచార్యస్వామివారు**

అధ్యక్షులు, సత్సంప్రదాయ పరిరక్షణ సభ,
16-4-523, శివనగర్, వరంగల్ - 506 002

## మంగళాశాసనము

చిన్నవారికి పెద్దలు చేయునది మంగళాశాసనము అని లోకులు భావింతురు. వైదికులు గూడ ఆశీర్వాదమను పేరుతో పిల్లలకు పెద్దమనుష్యులు చేయవలెననుచున్నారు. అర్వాచీనులైన విద్యావంతులు దీనిని ఇతరులు శుభాకాంక్షలు తెలుపుట అందురు. వాస్తవమునకు ఎవరు ఎవరికి మంగళాశాసనము చేయవలెనను నియమమేమియులేదు. ప్రేమకలవారు ఎవరైనను ఎవరికైనను చేయవచ్చునని, సాక్షాద్భగవంతునికే మంగళమును పాడిన పెరియాళ్వారుల అనుష్ఠానమునుబట్టి గ్రహింపవచ్చును.

ఆచార్యులు శిష్యులకు మంగళాశాసనమొనర్చుట సహజము. శిష్యులు తమ ఆచార్యులకు, వారి దివ్యమంగళ విగ్రహమునకుగూడ మంగళాశాసనమొనర్చుటలో, వారి భక్తి శ్రద్ధలు ప్రకటితమగుటచేత అదియు సమంజసమే. శ్రీవచనభూషణమున ఈ మంగళాశాసనచర్చ విశేషముగా చేయబడియున్నది.

భక్తులు ఇష్టదైవమునకు మంగళహారతులిచ్చుటలో ఈభక్తిభావమే అభివ్యక్తమగుచున్నది. విశేషించి, శ్రీ రామానుజీయ వైష్ణవసంప్రదాయమున భగవద్భాగవతాచార్యులకు మంగళాశాసనము చేయు ప్రక్రియ ప్రాధాన్యము నొందియున్నది.

సంస్కృతశ్లోకములలోగాని, స్వస్వదేశభాషలలోగాని స్వాభీష్ట దైవవిషయమై మంగళాశాసనమును కూర్చుట లోక ప్రసిద్ధమేకదా.

తమకు ప్రియతమాచార్యులైన శ్రీమణవాళమామునుల విషయమై తమిళమున శ్రీప్రతివాది భయంకరమ్ అణ్ణన్ స్వామివారు విన్నవించిన మంగళాశాసన గీతిక ఒకటి (వాழ்திరునామము) ప్రకృత గ్రన్థమునకు మూలము. ఆఒక్క తమిళగీతము పైననే



తదనంతరకాలికులైన శ్రీ పిళ్లైలోకమ్ జీయర్ అను ఆచార్యులు సరసమగు తమిళవ్యాఖ్యను విపులముగా ప్రసాదింపగా, దానిని ఆంధ్రభాషలోనికి శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులవారు అనువదించి ప్రకటించుచున్నారు.

వ్యాఖ్యాతృచక్రవర్తి అని ప్రసిద్ధినొందిన శ్రీపెరియవాచ్చాన్ పిళ్లైస్వామివారి తరువాత ఆచ్ఛాయలోనే తమ వ్యాఖ్యానరచనా వైభవమును ప్రకటించుకున్నవారైన శ్రీ పిళ్లై లోకమ్ జీయర్వారును పలు అర్వాచీనప్రబన్ధములకు, తనియనులకును మధురవ్యాఖ్యలను వ్రాసిరి. పలుచోట్ల ఈ తమిళవ్యాఖ్యానకర్త ప్రయోగించిన శ్లిష్టమధురవాక్యవిన్యాసములను యథోచితముగా, శ్లిష్టార్థభేదములను సమగ్రముగా అనువాదకర్త వివరించుట ఉభయభాషారహస్య వేత్తలకు అవశ్యము తృప్తిని కలిగించగలదు. సంస్కృతద్రవిడభాషలలో గల పలు సంప్రదాయగ్రన్థములకు విపులముగా ఆన్ధ్రవ్యాఖ్యలను వ్రాసి, ప్రకటించిన శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులవారి కృషి ప్రశంసనీయము. వీరి లేఖిని నుండి మరెన్నియో సంప్రదాయ వివరణ గ్రన్థములు ఆంధ్రభాషలో అవతరించి , అస్మాదృశులకు ప్రమోదమును కలిగించగలవని ఆశింతును.

శ్లో॥ **అణ్ణరాయచక్రవర్తిమూర్ధ్ని భూషణాయితమ్**
**తాతయార్యమానసే మరాళశాబకాయితమ్।**
**శాన్తిదాన్తిశేవధేః వరోపయన్తృయోగినః**
**పాదపంకజద్వయం శుభాని తేఽనిశం క్రియాత్ ॥**

(శ్రీవరవరముని పంచాశత్)

11-10-2005,
వరంగల్ - 2.

ఇట్లు
శ్రీ. న.చ. రఘునాథాచార్యులు
(శ్రీ.న.చ. రఘునాథాచార్యులు)

శ్రీమతే రామానుజాయ నమః

**న్యాయవేదాంతవిద్వాన్**
**ఉ॥వే॥శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు**
**అంతర్వేదిపాలెం**

# ప్రమోదము

శ్రీవైష్ణవ సంప్రదాయ ధురంధరులుగా, విశద వాక్శిఖామణిగా పేరొందిన ఆచార్యవర్యులగు శ్రీమద్వరవరమునులకు గల పలువురి శిష్యులలో అష్టదిగ్గజములు అను పేరుతో ప్రసిద్ధి చెందిన ఎనిమిది మంది శిష్యులు మిగుల సుప్రసిద్ధులు. వీరిలో ప్రతివాదిభయంకరం అణ్ణన్ ఒకరు. ఈ మహనీయులు సాటిలేని ఆచార్యభక్తిని కలవారు. వీరు శ్రీవరవర మునుల విషయమున అనుగ్రహించిన **"శెయ్యతామరై"** అను మంగళాశాసనపాశురము నిత్యము భగవదారాధనలో ఉత్తరశాంతి సమయమున ప్రపన్నులచే అనుసంధింపబడుచున్నది. దీనికి సుప్రసిద్ధ వ్యాఖ్యాతలగు శ్రీ పిళ్ళైలోకం జీయర్ మధురమైన మణిప్రవాళశైలిలో ఒక వ్యాఖ్యానమును వెలయించిరి. అది ఇంతవరకు ఆంధ్రదేశమున ప్రచారములో లేదు. ప్రస్తుతము ఆ వ్యాఖ్యను చి॥ శింగరాచార్యులు తెలుగు లిపిలో ఆంధ్రానువాదముతో పాటు ముద్రించుట శ్రీవైష్ణవలోకమునకు మిక్కిలి ఆనందము కలిగింపగలదని నా విశ్వాసము. భాగవతలోకము ఈ ప్రయత్నమును వాత్సల్యముతో ఆమోదించి చి॥శింగరాచార్యులకు ఉత్తరోత్తరాభివృద్ధి కలుగు రీతిలో మంగళాశాసనములు అనుగ్రహింపవలసినదిగా ప్రార్థించుచున్నాను. దయానిధి శ్రీనివాసుని దివ్యకటాక్షము వలన శ్రీ చి॥ శింగరాచార్యులుకు సకల శ్రేయస్సులు కలుగగలవని మంగళాశాసనములను చేయుచున్నాను. ఈ గ్రంథముద్రణకు తమ పవిత్రద్రవ్యమును ఇచ్చి ఉపకరించిన శ్రీయతీంద్ర ప్రవణ కైంకర్యసభ, హైదరాబాదువారిని హృదయపూర్వకముగా అభినందిచుచున్నాను.

ఇట్లు విన్నవించు

క్యాంపు : విశాఖ — భాగవత విధేయుడు

తేది : 19-10-2005 — **ఈయుణ్ణి రంగాచార్యులు**



**శ్రీమతే రామానుజాయ నమః**

# విజ్ఞప్తి

భగవద్రామానుజులవారిచే శ్రీవైష్ణవసిద్ధాంత ప్రచారమునకై నియమింపబడిన డెబ్బది నాలుగు సింహాసనాధిపతులలో ముదుమ్బై నమ్బి ఒకరు. శ్రీరామానుజుల తిరుమేని సంబంధమును కల్గినవారును, గొప్పజ్ఞాన భక్తివైరాగ్యములను కల్గినవారగు ఈ ఆచార్యవర్యులు శ్రీవత్స గోత్రమునకు చెందినవారు. ఈడు లేఖకులగు వడక్కుత్తిరువీధిప్పిళ్లై , అష్టాదశ రహస్య గ్రంథకర్తలగు పిళ్లై లోకాచార్యులవారు, ఆచార్యహృదయమను అపూర్వమైన రహస్యగ్రంథమును రచించిన అళ్కియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ మొదలగు సుప్రసిద్ధులైన ఆచార్యులు ఎందరో ఈవంశమున అవతరించిరి. సహజముగా గొప్ప పవిత్రత కల్గిన ఈ వంశము అవతారపురుషులుగా కీర్తింపబడు శ్రీరామానుజులు, నమ్బిళ్లై, మణవాళమహామునులచే అనుగ్రహింపబడిన ముదుమ్బైనమ్బి, వడక్కుత్తిరువీధిపిళ్లై, ప్రతివాదిభయంకరంఅణ్ణన్‌స్వామియు జనించుటచే మరింత పూతమైనది. సమీప కాలమున శ్రీగాది ఆనంతాచార్యస్వామివారు, శ్రీ.ప్ర.భ. కాంచీ అణ్ణంగరాచార్యస్వామివారు, తిరునాంగూర్ అణ్ణంగరాచార్యస్వామివారు మొదలగు పండిత ప్రకాండులైన ఆచార్యులు ఈ వంశమును తమ అవతారములచే మరింత ప్రసిద్ధముచేసిరి.

ఇట్టి మహనీయమైన ముదుమ్బై నమ్బివంశమున జన్మించిన అనంతాచార్యులను మహనీయులు కాంచీపురమునకు దగ్గరకల **"తిరుత్తణ్కా"** అను పుణ్యక్షేత్రమున నివసించుచుండిరి. వారి భాగ్యఫలముగా క్రీ.శ. 1361 వ సంవత్సరమున ప్లవనామసంవత్సరము, ఆషాఢ మాసము(ఆడిమాసము) కృష్ణ చతుర్దశి మంగళవారమునాడు పుష్యమీనక్షత్రమున ఒక కుమారుడు జన్మించెను. ఆబాలునకు తండ్రి శ్రీ కంచి వరదరాజస్వామిపేరు కలియునట్లు **"హస్తిగిరినాథనణ్ణన్"** అనిపేరు పెట్టిరి. యథాకాలము సంస్కారములను పొందిన అణ్ణన్ సకల విద్యలను అభ్యసించిన పిదప వేదాంతదేశికుల కుమారులగు నయన వరదాచార్యులవారి సన్నిధిలో శ్రీభాష్యము మొదలగు వేదాంత గ్రంథములను అధికరించిరి. పిమ్మట గృహస్థాశ్రమమును స్వీకరించి, వరదరాజస్వామిసన్నిధిలో **"శాలక్కిణఱు"** అను బావినుండి స్వామి ఆరాధనకు అవసరమైన తీర్థమును తీసికొను వచ్చు కైంకర్యమును నిర్వహించుచుండిరి.

ఒకనాడు నృసింహమిశ్రుడను మాయావాది నయనవరదాచార్యులవారితో

వాదముచేయ గోరి కాంచీపురమునకు వచ్చెను. అణ్ణన్ స్వాచార్యుల నియమనమును పొంది,మాయావాదితో వాదించి, అతనిని ఓడించెను. ఇట్లు వాదమున జయించి తిరిగి వచ్చిన అణ్ణన్ స్వామిని చూచి నయనవరదాచార్యులవారు“ ఓ[ప్రతివాదిభయంకరా ! రండు” అని ఆదరముగా పిలచిరి. అప్పటినుండి అణ్ణన్‌కు, వారివంశము వారికిని “ప్రతివాదిభయంకరమ్”అను ఉపపదము ప్రసిద్ధమయ్యెను. కొంత కాలమునకు నయనవరదాచార్యులవారు పరమపదమునకు చేరిరి. అణ్ణన్ పూర్వమువలెనే వరదరాజస్వామి కోవెలలో తీర్థమును తెచ్చు కైంకర్యమును చేయుచుండిరి.

ఇట్లుండగా ఒకనాడు అణ్ణన్ **“ఒழివిల్ కాలమెల్లామ్”** దశకమున నమ్మాழ్వార్లు శ్రీవేంకటేశ్వరునకు అవిచ్ఛిన్నముగా కైంకర్యమును చేయవలెనని ఆశపడుటను స్మరించి, అట్టి కైంకర్యమును తామును చేయవలెనను ఉత్కంఠను పొందిరి. అందులకు శ్రీవరదరాజస్వామి అనుమతిని పొందిన అణ్ణన్ తిరుమలకు చేరి, తిరుమలలో తోழప్పర్ అనుగ్రహముతో శ్రీనివాసుని ఆరాధనకు అవసరమగు తీర్థమును ప్రతిదినము వెండి బిందెతో ఆకాశగంగనుండి తీసికొనివచ్చి, అందు సుగంధ ద్రవ్యములను చేర్చి, సమర్పించుచుండిరి. ఒకనాడు శ్రీరంగమునుండి తిరుమలకు వచ్చిన శ్రీవైష్ణవులు శ్రీరంగములో మణవాళమహాముసుల వైభవమును గూర్చి సంభాషించుకొనుచుండగా , వారి మాటలను అణ్ణన్ వినిరి. మణవాళమహామునుల గొప్పదనమును విని ఆశ్చర్యపడుచుండిన అణ్ణన్ స్వామి ఆరాధనకు తీర్థమును తీసికొని వచ్చుటలో కొంత ఆలస్యమును చేసిరి. ఇంతలో ఏకాంగి అచటకు పరుగునవచ్చి “స్వామీ ! ఇంత ఆలస్యమును చేసితిరి ఏమి ?”అని పల్కుచు అణ్ణన్ చేతిలోని తీర్థకలశమును తాము వేగముగా తీసికొని పోయిరి. అణ్ణన్ ఆతీర్థములో సుగంధ ద్రవ్యములను కలుపలేదని గ్రహించి , “అపచారము జరిగినది కదా !” అని విచారించుచుండిరి. అపుడు శ్రీనివాసుడు అర్చకముఖమున “అణ్ణా ! ఇన్నిదినములుగా మీరు తెచ్చు తీర్థముకంటే ఈనాటి తీర్థము మిక్కిలిగా పరిమళించుచుండుటకేమి కారణము?”అని ఆదరముగా ప్రశ్నించెను. భగవానుడట్లు పల్కుటకు మణవాళమహామునుల చరిత్రను వినుచు తాము తీర్థమును తీసికొని వచ్చుటయే కారణమై యుండునని అణ్ణన్ గ్రహించిరి. అప్పటి నుండి అణ్ణన్‌కు మణవాళమహామునులను సేవింపవలెనను కోరిక దినదినము వృద్ధిచెందసాగినది.

పిమ్మట అణ్ణన్ శ్రీవేంకటేశ్వరుని అనుజ్ఞను పొంది, కాంచీపురమును చేరిరి. అచటి స్వామి అనుగ్రహమును పొంది, అచటనే కొంత కాలముండిరి. ఇట్లుండగా ఒక మాయావాది శ్రీరంగమునకు వచ్చి, తనతో వాదింపగల్గు వారెవ్వరైన కలరా? అని ప్రశ్నించెను.



ఆమాయావాది గతమున **“వేదలప్పై”** (విట్టలప్ప) అను తన శిష్యుని ఆశ్రయించినవాడైనను, సహవాసదోషమువలన మాయావాదిగా మారెనని గుర్తించిన మణవాళమహాముని అతనితో వాదించుట తమకు తగదని తలచి,వేదలప్పై ద్వారానే అతనిని నిర్జించుటయుక్తమని తలచి, తమ శిష్యులద్వారా వేదలప్పైను మాయావాదితో వాదింప ఆజ్ఞాపించిరి. తన గురువే వాదింపవచ్చెనని తెలిసిన మాయావాది భయపడి అచటినుండి పారిపోయెను. మణవాళమహామునులు వేదలప్పైను తమ వద్దనే ఉండుడని కోరిరి. కాని అతడు అచట చిరకాలము ఉండుటకు ఇష్టపడక, తిరిగి తన ఊరును చేరెను.

మణవాళమహామునులు ప్రతివాదులను ఓడించి, దర్శననిర్వాహమును నిష్కంటకముగా చేయుటకు తమకు తోడుగా నుండగల్గిన వారెవ్వరు కలరా? అని ఆలోచింపగా –అప్పుడు కాంచీపురమున నివసించు అణ్ణన్ అందులకు సమర్థులని వారికి తెలిసెను. వెంటనే ఇద్దరు తమ ఆంతరంగిక శిష్యుల ద్వారా, అణ్ణన్‌ను ఆహ్వానించుచు లేఖను పంపిరి. అణ్ణన్ ఆలేఖను సగౌరవముగా స్వీకరించి, వరదరాజస్వామి అనుజ్ఞను పొంది, మణవాళమహామునులను దర్శించుటకై శ్రీరంగమును చేరిరి.

అణ్ణన్ శ్రీరంగమునకు చేరు సమయమున అచట మణవాళమహాముని తిరువాయ్ మొழి దివ్యప్రబంధములోని **“ఒన్ఱుమ్ తేవుమ్”**దశకమును గూర్చి ఉపన్యసించుచు, పరశ్శత ప్రమాణములతో శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని నిర్ణయించు చుండిరి. వారి వేదాంత పాండితీగరిమకు ఆశ్చర్యపడిన అణ్ణన్ వారివద్దకు వెడలి, తమను శిష్యునిగా అనుగ్రహింపుడని ప్రార్థించిరి. మణవాళమహామునులు వారిని చూచి “మీరు ప్రతివాదిభయంకరులు,నేను సామాన్యుడను , సాధువును. మన మధ్యసంబంధము ఎట్లు ఘటించును?” అని చమత్కరించిరి. అపుడు అణ్ణన్ వినయముగా “స్వామీ! నేను ప్రతివాదులకు భయంకరుడనేగాని, శ్రీవైష్ణవగోష్ఠిలో దాసానుదాసుడను(**ప్రసిద్ధః పరగోష్ఠీషు ప్రతివాదిభయంకరః, శ్రీ వైష్ణవానాం గోష్ఠీషు తద్దాస ఇతి విశ్రుతః**) అని బదులుపల్కిరి. అణ్ణన్ వినయసంపదకు మెచ్చిన మణవాళమహామునులు వారికి పంచసంస్కారములను అనుగ్రహించి, తమ శిష్యులుగా స్వీకరించిరి. అప్పటినుండి అణ్ణన్ మణవాళమహామునుల పట్ల **“తేవు మత్తఱియేన్”** అనునట్లు అనితర సాధారణమైన ప్రావణ్యమును కల్గి,శ్రీరామానుజులకు కూరేశులవలె, కుడిభుజముగా నిలచిరి. **“వరవరమునితాం యాతే యతిరాజే సకలలోకజీవాతౌ,శ్రీవాదిభీకరోऽభూత్ శ్రీమాన్ శ్రీవత్సచిహ్నమిశ్రోऽపి”**(సకల లోకములకు జీవనౌషధమువంటి రామానుజులు మణవాళమహామునులుగా అవతరింపగా, కూరేశులు ప్రతివాది భయంకరం అణ్ణన్‌గా

అవతరించిరి) అను శ్లోక మీవిషయమును స్పష్టము చేయుచున్నది. మణవాళమహామునులును వీరి విషయమున గొప్ప ఆదరాతిశయములను కల్గియుండిరి. అణ్ణన్ మణవాళమహామునుల ఆజ్ఞానుసారము వారి (మణవాళమహామునుల) పౌత్రులగు జీయర్ నాయనార్‌కు, కన్దాడైనాయన్‌కు శ్రీభాష్యమును ప్రసాదించిరి. అట్లే , పరవస్తు పట్టర్‌పిరాన్ శ్రీనివాసాచార్యులను వారికి, వారి సబ్రహ్మచారియైన అఴకియ మణవాళజీయర్‌కును తిరువాయ్‌మొఴి ఈడు వ్యాఖ్యానమును కాలక్షేపమును చెప్పిరి-. అని యతీంద్రప్రవణప్రభావమను సంప్రదాయ చరిత్ర గ్రంథమున కలదు. ఇట్లు మణవాళమహామునుల కాలములోనే అణ్ణన్ శ్రీభాష్యప్రవచనమున ప్రధానులుగానున్నట్లు తెలియుచున్నది.

ఈ మహనీయులు మణవాళమునుల అవతారసమాప్తి అయిన పిదప ఆచార్యవిరహక్లేశమును భరింపలేక శ్రీరంగమును వదలి, తిరునారాయణపురము (మేల్కోట)లో కొంతకాలము, కంచిలో కొంత కాలము ఉండి, చివరకు తిరుమలను చేరి, అచట స్వామిని సేవించుచు, చివరకు క్రీ.శ.1455 వ సంవత్సరము శ్రీముఖ సంవత్సరము పంగుని (ఫాల్గున) మాసమున శుక్లనవమీ తిథియందు ఆచార్యపాదసన్నిధిని చేరిరి.

అణ్ణన్ రచనలుగా చెప్పబడు గ్రంథములలో – శ్రీభాష్యము, భాగవతము, సుబాలోపనిషత్, అష్టశ్లోకీ, యతిరాజవింశతి– అను గ్రంథములపై లఘు వ్యాఖ్యానములు, శ్రీవేంకటేశ్వర సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళములను, శ్రీరంగనాథ సుప్రభాతము, రామానుజ సుప్రభాతము, శ్రీకృష్ణమంగళము, ప్రపత్తియోగకారిక, సప్తతిరత్నమాలిక, శ్రీవరవరముని శతకము, పాదాదికేశమాలై, బుద్ధిస్తవము, నిత్యారాధనవిధి, వరవరముని సుప్రభాతము, భాష్యకార మంగళము ప్రసిద్ధములు. ఇవికాక ప్రస్తుత వ్యాఖ్యానమునకు విషయమగు మణవాళమహామునుల వాఴి త్తిరునామమును (మంగళము) అణ్ణన్ రచించిరి. అంతియేకాక, తిరుమల వేంకటేశ్వరునకు వలె మిగిలిన దివ్యదేశములలోని అర్చా మూర్తులకు సుప్రభాత స్తోత్రములను ఆచార్యుల ఆజ్ఞానుసారము వీరు రచించిరని చెప్పబడుచున్నది. అణ్ణన్ రచించిన వరవరమునిశతకము వీరి అలంకారశాస్త్రపాండిత్యముకు నికషోపలము. అట్లే, అష్టశ్లోకీ వ్యాఖ్యానము అణ్ణన్‌యొక్క న్యాయ, వ్యాకరణమీమాంసావేదాంతాదిశాస్త్ర జ్ఞానమును ఋజువు చేయుచున్నది. **పాదాదికేశమాలై, ''శెయ్యతామరైత్తాళిణై''** వాఴిత్తిరునామమును వీరి ద్రావిడ భాషలో సుమధురపాశురప్రణయనపటుత్వమునకు తార్కాణములు.

ఉ.వే. శ్రీమాన్ డి.టి. తాతాచార్యస్వామివారి సంపాదకత్వమున తిరుమల తిరుపతి



దేవస్థానములవారు 1941 వ సంవత్సరము ప్రచురించిన **"శ్రీవేంకటేశకావ్యకలాపః"**అను గ్రంథమున లక్ష్మీస్తోత్రము, శ్రీవేంకటేశ విజయార్యాసప్తవిభక్తిస్తోత్రము, శ్రీవేంకటేశస్తోత్రము, శ్రీ వేంకటేశ విజయస్తోత్రము, ఫణీంద్రక్ష్మాభృత్ స్తోత్రము, అంజన శైలనాథస్తోత్రము అను ఆఱు స్తోత్రములు అణ్ణన్ రచనలుగా పేర్కొనబడినవి. కాని, ఇవి ఎక్కువ ప్రచారములో లేక పోవుటచే అప్రసిద్ధములయ్యెనని చెప్పవచ్చునని **గురువర్యులు, కీర్తిమూర్తులు,న్యాయవేదాంత విద్వాన్ ఉ.వే.శ్రీమాన్, శ్రీవైష్ణవసింహ బిరుదభూషితులు, టి.ఎ. కృష్ణమాచార్యస్వామి వారు** వాదిభీకరార్యసూక్తిమాలికా – ప్రథమ భాగములోని ఉపోద్ఘాతమున పల్కిరి.

ఇక, ప్రస్తుతవ్యాఖ్యానమునుగూర్చి, ప్రస్తుతవ్యాఖ్యానమునకు మూలమగు వాఴిత్తిరునామమునుగూర్చి కొంచెము విన్నపింపబడుచున్నది. ఈపాశురమును అణ్ణన్ ఏసందర్భమున రచించిరనునది స్పష్టముగా తెలియుటలేదు. కాని ఇది **"ఆశారియన్ శిచ్చనారుయిరై ప్పేణుమవన్, తేశారుమ్ శిచ్చ నవన్ శీర్‌వడివై "** అను ఉపదేశరత్తినమాలై లోని పాశురార్థమునకు లక్ష్యముగా వెలుగొందుచున్నది. మణవాళమహామునులు పరమపదించిన సందర్భమున ఈపాశురమును వారి శిష్యులు అనుసంధించిరని యతీంద్రప్రవణప్రభావమున కానవచ్చుటచే , ప్రాయశః ఈరచన మణవాళమహామునులు జీవించియుండగానే జరిగినదని చెప్పవచ్చును. కొన్ని నిత్యానుసంధాన శ్రీకోశములలో ఈ వాఴిత్తిరునామము చోటు చేసికొనకున్నను, ఉత్తరశాంతి (శాత్తుముఱై) సందర్భమున శ్రీవైష్ణవుల గృహములలో, విష్ణ్వాలయములలో ఈపాశురము అనుసంధింపబడుటవలన దీనికిగల ఆదరము, ప్రచారమును ఎట్టిదో తెలియుచున్నది. ఈ పాశురముపిమ్మట అనుసంధింపబడు **"అడియార్‌గళ్ వాఴ"**ఇత్యాది పాశురము కొన్ని నిత్యానుసంధాన కోశములలో **"మడత్తు ప్పిళ్లై"** సాయించినట్లుండుటచే, ప్రస్తుతవాఴి త్తిరునామమును కూడ మడత్తుప్పిళ్లైయే సాయించిరని కొందరు అభిప్రాయపడుచున్నను, అణ్ణన్ రచనగానే ఈ వాఴి త్తిరునామము సంప్రదాయమున ప్రసిద్ధిచెందుటచే తత్కర్తృకముగా పరిగణించుటయే భావ్యము.

ఇందు మణవాళమహామునుల దివ్యమంగళరూపము పాదములు మొదలు, నేత్రములవరకు స్తుతింపబడినది. అందుచే దివ్యుల రూపవర్ణనమును పాదాదికేశాంతము చేయవలెనను కవి సమయమిందు పాటింపబడినది. ఈ వాఴిత్తిరునామమునకు, మణవాళమహామునులు రామానుజులను గూర్చి సాయించిన **"శీరారుమ్ ఎతిరాశర్ తిరువడిగళ్ వాఴియే"**అను వాఴి త్తిరునామమునకు గల అర్థసామ్యము మిగుల స్మరణీయము, రమణీయమును.

శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ కర్తృకముగా చెప్పబడు ప్రస్తుతవ్యాఖ్యానము ఇంతవరకును తెలుగు లిపిలో గాని, తెలుగు భాషలో అనువదింపబడిగాని ప్రచురింపబడలేదు. మద్రాస్ ప్రభుత్వమువారి హస్తలిఖిత గ్రంథాలయములో ఆర్.354 వ నంబరు గల తాళపత్రగ్రంథప్రతినిబట్టి మద్రాస్, తిరువల్లిక్కేణినుండి ఉ.వే. శ్రీమాన్ యమ్.ఎ. వేంకటకృష్ణన్ స్వామి సంపాదకత్వమున తమిళభాషలో వెలువడు **"గీతాచార్యన్"** అను శ్రీవైష్ణవమాసపత్రికలో మొదటగా కొంతకాలము క్రితము మూలము మాత్రము ప్రచురించబడినది. రెండవమారుగా 1996 వ సంవత్సరమున **" తిరుక్కడల్ మల్లై"** (మహాబలిపురము) దివ్యదేవములోని ఆలయ పునరుద్ధరణ సందర్భమున పిళ్లై లోకంజీయర్‌ట్రస్టు వారు ప్రచురించిన **"కడల్ మల్లైక్కరుమ్బు"**అను స్మారకసంచికలో మూలముతో పాటు, సరళమైన తమిళవివరణమును ప్రచురింపబడినది. తమిళవివరణమును డా. ఉ.వే. శ్రీమాన్ యమ్.ఎ. వేంకటకృష్ణన్ స్వామి (గీతాచార్యమాస పత్రికాసంపాదకులు) చేసిరి.

డా. యమ్.ఎ. వేంకటకృష్ణన్ స్వామి ఈ వ్యాఖ్యాన కర్తృత్వమును గూర్చి ఇట్లు అభిప్రాయపడిరి– "ఈ వ్యాఖ్యానమును ఎవరు రచించిరి అను అంశము స్పష్టము కాకున్నను, శైలిని బట్టి ఈ వ్యాఖ్య పిళ్లైలోకం జీయర్‌చే రచింపబడినట్లు చెప్పవచ్చును. నాలాయిరదివ్య ప్రబంధ తనియన్‌లకు, ఇయల్‌శాత్తుకు, మణవాళమహామునుల గ్రంథములకు అన్నిటికిని వ్యాఖ్యను రచించిన పిళ్లైలోకంజీయరే ఈ రచనను చేసిరని చెప్పుట యుక్తమని తోచును. అంతియేకాక, ఉ.వే. శ్రీమాన్ తిరునాంగూర్ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు **"పట్టోలై"** అను గ్రంథమును ప్రచురించిరి. ఆగ్రంథము వారి ఇంటిలోగల తాళ పత్ర గ్రంథప్రతిని బట్టి ప్రచురింపబడినది. అందు ఈ వ్యాఖ్యానముయొక్క ప్రసక్తి కలదని వారు తెలిపిరి. ఆ గ్రంథమున పూర్వాచార్యుల నామములు, వారు రచించిన గ్రంథములపేర్ల వివరములును కలవు. వానిలోని వివరములనుబట్టికూడ ప్రస్తుత వ్యాఖ్యానమును పిళ్లైలోకంజీయర్ రచించినట్లు తెలియుచున్నది. అందువలన ఈ వ్యాఖ్యాకర్త పిళ్లై లోకంజీయరే అని భావించుటకు ఎక్కువ అవకాశముకలదు."

ఇందు అణ్ణరాయ చక్రవర్తికి, కూరత్తాళ్వాన్‌కు (పల్లవరాయలకు ?) సంబంధించిన ఐతిహ్యములు ఉట్టంకింపబడినవి. వానిలో అణ్ణరాయ చక్రవర్తి ఐతిహ్యము యతీంద్ర ప్రవణ ప్రభావమున, ఆచార్యసూక్తిముక్తావళి అను తెలుగు కావ్యమున కన్పించుచున్నది అణ్ణన్ రచించిన మణవాళమహామునుల స్తుతిపరమగు **"పాదాదికేశమాలై"**లోని పలుపాశురములు ఇందు ఉట్టంకింపబడినవి. దివ్యప్రబంధ పాశురములు సమయోచితముగా ఉదహరింపబడుట



వ్యాఖ్యాతయొక్క గాఢమైన దివ్యప్రబంధార్థావగాహనమును నిరూపించుచున్నది. వ్యాఖ్యానము ఇంచు మించుగా పూర్ణము. చివరలో **"ఇవర్ పల్లవరాయరుక్కే"** అనుచోటమాత్రము వ్యాఖ్య కొంచెము అసంపూర్ణముగా తోచుచున్నది. అయినను అర్థపూర్తికి ఇది కొఱతను కల్గింపదు.

యతీంద్ర ప్రవణప్రభావమున, ఆచార్యముక్తి ముక్తావళిలో శ్రీమణవాళమహామునులు సన్న్యసించిన పిమ్మట తమకు తురీయాశ్రమమును అనుగ్రహించిన శఠకోపజీయర్ ఆజ్ఞానుసారము పల్లవరాయని మఠమున కొన్నాళ్ళు నివసించిరని కలదు. వ్యాఖ్యానమున ఉట్టంకింపబడిన పల్లవరాయ వృత్తాంతము ఇదియే అగునా? కాదా? అనుట స్పష్టముగా తెలియుటలేదు.

రస్యమైన ఈ వ్యాఖ్యానము పలుతావుల తిరువాయ్ మొழி ఈడు వ్యాఖ్యానమును తలపించును. **"కాల్ వాశియిలే నిల్లామల్ అరైవాశి తేదుమవతిరే", "కణ్ కాణ కైవిట్టార్", "ఇవర్ కణ్ణితే ఎల్లార్‌క్కుమ్ కళైకణ్"** వంటి పలు చాటూక్తులు ఇందు కన్పించుచున్నవి. పలుచోట్ల యోజనాంతరములు చూపబడినవి. వ్యాఖ్యానమున పలుచోట్ల మణవాళమహామునులకు సర్వేశ్వరునకు మధ్యగల సామ్యముతోపాటు, మణవాళమహామునుల ఆధిక్యముకూడ నిరూపింపబడినది. **"అమ్మావొరుత్తి క్కిడముద్దైత్తాయాయ్‌త్తు అమ్మార్బు , ఇమ్మార్బు ఇరువర్‌క్కుమ్ ఇడైముదైత్తా యిరుక్కుమ్ "** మొదలగునవి ఇందులకు ఉదాహరణములు. ఈసందర్భమున అణ్ణన్ రచించిన వరవరమునిశతకములో భగవానుని అవతారములకు, మణవాళమహామునులకు మధ్యగల సాదృశ్యము నిరూపింపబడుట స్మరింపతగినది.

ఈ వ్యాఖ్యానమున ఉదాహరింపబడిన ప్రమాణముల ఆకరములు లభించినంత వరకు చూపబడినవి. తమిళప్రచురణములో ఆకరము చూపబడని మరికొన్ని ప్రమాణములకును ఇందు ఆకరములు చూపబడినవి. **"వన్దరుళి", "ఎన్నై ఎడుత్త"** ఇత్యాదులట్టివి. వ్యాఖ్యాత శ్రీ పిళ్లైలోకమ్ జీయర్ వైభవసంగ్రహముకూడ ప్రత్యేకముగాచేర్చబడినది.

పరమభోగ్యమైన ఈ వ్యాఖ్యానము మూలముతో పాటు, దీని ఆంధ్రానువాదమును ప్రచురించి భాగవతలోకమునకు సేవచేయవలెనను పేరాశయే నన్ను ఈ సాహసమునకు పురికొల్పినది. నన్నీ ప్రయత్నమున ప్రోత్సహించిన కీర్తిమూర్తులు, శ్రీ వైష్ణవ సింహ న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే. శ్రీమాన్, టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారికి, మిత్రము ఉ.వే. శ్రీమాన్ డా. యమ్. వరదరాజన్‌స్వామివారికి నా మనఃపూర్వకమైన కృతజ్ఞతలను తెలియజేసుకొనుచున్నాను. సుమారు 7 సంవత్సరములకు ముందే ఈ అనువాదము చేయబడి,

గురువర్యులు, కవిశాబ్దికకేసరి, మహామహోపాధ్యాయ, శాస్త్రరత్నాకర, ఉ॥వే॥ మహావిద్వాన్ శ్రీ న.చ. రఘునాథాచార్యస్వామి వారి యొక్క, న్యాయవిద్వాన్, ఉ॥వే॥మహావిద్వాన్, టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారియొక్క దివ్య కటాక్షములకు పాత్రమైనది. ఈ వ్యాఖ్యను అనువదించి, ప్రచురించుటకు అనుమతించిన పిళ్లైలోకంజీయర్ ట్రస్టువారికి నా హార్దికమైన కృతజ్ఞతాంజలులు. దాసుని ప్రార్థనను కాదనక దయతో ఈ అనువాదమును కటాక్షించి మంగళాశాసనములను అనుగ్రహించినశ్రీ భాష్యకార సిద్ధాన్త పీఠము వ్యవస్థాపకులు, పరమహంస పరివ్రాజకాచార్య, శ్రీశ్రీశ్రీ రామచంద్ర జీయర్‌స్వామివారి సన్నిధిలో,తమ అశక్తినిసైతము లెక్కచేయక,అనువాదమును కటాక్షించి, మంగళాశాసనమును కృపచేసిన ఉ॥వే॥ శ్రీమాన్ రఘునాథాచార్యస్వామి వారి సన్నిధిలో సవినయముగా**"తలైయల్లాల్ కైమ్మాఱిలేన్"** అనురీతిలో శిరసా ప్రణమిల్లుచున్నాను. వస్తువుకాని నన్ను పరమకృపతో అనుగ్రహిచిన ఆచార్యులు,పితామహపాదులు, కీర్తిమూర్తులు ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణిశేషశింగరాచార్యస్వామి వారి సన్నిధిలో, వాత్సల్యముతో కాలక్షేపమును కృపచేయుటయేకాక,అడుగడుగున దాసుని ప్రోత్సహించుచు, తగుసూచనలను అనుగ్రహించుచున్న పితృపాదులు ఉ.వే. శ్రీమాన్ న్యాయవేదాంత విద్వాన్, ఈయుణ్ణిరంగాచార్యస్వామివారి సన్నిధిలో కృతజ్ఞతాపూర్వకముగా అంజలిని ఘటించుచున్నాను. శ్రీయతీంద్రప్రవణకైంకర్యసభ, హైదరాబాదు వారు మిక్కిలి అభిమానముతో అందించిన పవిత్రద్రవ్యముతో ఈ గ్రంథముద్రణ చేయబడుచున్నది. వారి ఆస్తిక్యమునకు, సంప్రదాయ ప్రావణ్యమునకును పెద్దలు మంగళాశాసనములను అనుగ్రహింప వేడెదను. గుణైకగ్రాహులగు పండితులందఱు ఇందలి దోషములను మన్నింతురని గుణములున్నచో గ్రహితలంతును. ఈసంవత్సరము శ్రీ మణవాళ మహామునుల తిరునక్షత్ర శుభ సందర్భమునకు జ్ఞాపికగా శ్రీ యతీంద్రప్రవణకైంకర్యసభవారు సమర్పించు ప్రథమపుష్పముగా ఈ గ్రంథము భాగవత లోకమునకు అందించబడుచున్నది.

**"అజ్ఞానాద్విహితాన్ దోషాన్ క్షమధ్వం కృపయా మమ"**

ఇట్లు

భాగవతవిధేయుడు,

**ఈ.ఏ. శింగరాచార్యులు.**

తిరుపతి.
18.7.05





**శ్రీమతే రామానుజాయ నమః**

# శ్రీ పిళ్లైలోకమ్ జీయర్ వైభవసంగ్రహము

భగవద్రామానుజులు విశిష్టాద్వైతసిద్ధాంత ప్రచారము కొఱకు నియమించిన 74 మంది సింహాసనాధిపతులలో ఒకరగు నడువిల్ ఆழ்వాన్ వంశమున జన్మించిన మహనీయులు శ్రీ పిళ్లైలోకమ్‌జీయర్. వీరు గార్గ్యవంశజులు. శ్రీమన్మణవాళమహామునులకుగల అష్టదిగ్గజములను ఎనిమిదిమంది శిష్యులలో పట్టర్ పిరాన్ జీయర్ అను మహనీయులకు మూడవతరము వారు శ్రీ పిళ్లైలోకమ్ జీయర్. వీరి పూర్వాశ్రమములోని పేరు వరదాచార్యులు. వీరి తండ్రి గారు శఠకోపాచార్యులవారు, పితామహులు అழ்కియమణ వాళన్, ముత్తాత పట్టర్ పిరాన్ జీయర్. వీరు స్వయమాచార్య కుటుంబమునకు చెందిన వారు. శ్రీమద్వరవరమునులు క్రీ.శ. 1443 వ సం.మున అవతారసమాప్తిని చేసిరని చరిత్ర తెలుపుచున్నది. అప్పటినుండి మూడవతరములో పిమ్మట జన్మించిన పిళ్లైలోకమ్ జీయర్ కాలమును సుమారుగా 1525ప్రాంతముగా భావింపవీలున్న అని విమర్శకుల తలపు. వీరు రచించిన యతీంద్ర ప్రవణప్రభావమను సంప్రదాయ చరిత్ర గ్రంథములో వీరి స్తుతి శ్లోకము (తనియన్) ఇట్లున్నది.

**శ్రీశఠారి గురోర్దివ్యశ్రీపాదాబ్జమధువ్రతమ్ ।**
**శ్రీమద్యతీంద్రప్రవణం శ్రీలోకార్యమునిం భజే ॥**

ఇంకను ఆర్తి ప్రబంధ వ్యాఖ్యానప్రారంభములోగల తనియన్ ఇట్లున్నది.

**లోకాచార్యమునిం వందే ధీశమాదిగుణార్ణవమ్ ।**

**తం శఠారిగురోః శిష్య మార్తివ్యాఖ్యాం కరోతి యః॥**

శ్రీవైష్ణవసమయాచారనిష్కర్షలో ఉపదేశరత్నమాల వ్యాఖ్యచివరలో, ఆర్తిప్రబంధవ్యాఖ్యానము చివరలో ఈ మహనీయుల స్తుతి శ్లోకములు పలుకన్పించుచున్నది.

**చైత్రే మాసి శ్రవణభే గార్గ్యవంశాంబుధే ర్విధుమ్ ।**
**అవతీర్ణమ్ లోకగురుం శఠారిసుత మాశ్రయే ॥**

అను శ్లోకమునుబట్టి వీరు చైత్రమాసము శ్రవణానక్షత్రములో గార్గ్యవంశమున జన్మించిరని వేరొక వాదము ఉన్నట్లు తెలియుచున్నది. ఇంతకుమించి వీరి చరిత్రవివరములు ఎక్కువగా

లభించుటలేదు. క్రీ.శ. 1614 వ సం.న ఆనందనామసంవత్సరములో విజయనగరప్రభువగు వీరనరసింహరాయలు శ్రీపిళ్లైలోకమ్‌జీయర్‌వారికి వ్రాసి ఇచ్చిన తామ్రశాసన మొకటి లభించుచున్నది. వీరికి భగవద్విషయ వ్యాఖ్యానములలోగల అగాధమైన పాండిత్యము **"ఆచార్యాణాం శఠరిపుకృతే రర్థనిర్వాహశక్త్యా ప్రాచాం పశ్చాద్భువి సుమతయో యం వదంతి ప్రకల్పమ్"** అను ఆర్తిప్రబంధ వ్యాఖ్యాన ప్రారంభములోని సూక్తి తెలుపుచున్నది.

వీరు రచించినగ్రంథములు :-

1. **ఇరామానుజార్యదివ్యచరితై:**-ఇది శ్రీరామానుజుల చరిత్రను వర్ణించు సంప్రదాయ చరిత్ర గ్రంథము. గరుడవాహనపండితుని దివ్యసూరిచరితము,పిన్బళకియ పెరుమాళ్‌జీయర్ అఱాయిరప్పడి గురుపరంపరాప్రభావము, పెరియతిరుముడి అడైవు మొదలగు చరిత్ర గ్రంథములను అనుసరించుచు, సాగిన రచన ఇది. శ్రీరామానుజుల తాలాట్టు పాటలు, తిరుమఙ్జనక్కవి, కట్టియము, తిరుచ్చిన్నమ్, వాళ్తిరునామమ్, పల్లాణ్డు మొదలగు లఘుకృతులిందు కన్పించుచున్నను, అవి అన్నియు పిళ్లైలోకమ్‌జీయర్ రచించినవి కావు అని కొందరి విమర్శకుల భావన.

2. **యతీంద్రప్రవణప్రభావము:-** ఇదియును సంప్రదాయచరిత్రగ్రంథమే. ఇందు శ్రీమద్వరవరమునుల చరిత్రవైభవము సంప్రదాయసిద్ధముగా తెలుపబడినది. ఆ ఆచార్యవర్యులకు చెందిన పలు ఐతిహ్యములు ఇందు చోటుచేసికొన్నవి.

3. **ఉపదేశత్తిరునామమ్:-** 89 తమిళ పాశురముతో కూడిన ఈకృతిని పిళ్లైలోకమ్‌జీయర్ రచించినట్లు చెప్పబడుచున్నది. ప్రాయశః యతీంద్రప్రవణప్రభావాదిగ్రంథములలో వీరిచే రచింపబడిన పాశురములే తర్వాతి కాలమున ప్రత్యేక గ్రంథముగా ఉపదేశత్తిరునామమను పేరులో కూర్చబడియుండవచ్చునని పండితుల తలంపు.

4. **ఇరామానుశనూఱ్ఱన్దాది వ్యాఖ్య :-** శ్రీరంగామృతకవిగా ప్రసిద్ధులైన తిరువరంగత్తముదనార్ శ్రీరామానుజుల విషయమున అనుగ్రహించిన, ప్రపన్నగాయత్రిగా పేరొందిన తమిళ ప్రబంధమునకు విస్తృత వ్యాఖ్య ఇది.

5. **తిరువాయ్‌మొళి నూఱ్ఱన్దాది వ్యాఖ్య:-** శ్రీవరవరమునులచే విరచితమైన **తిరువాయ్‌మొళి ప్రబంధముయొక్క దశకముల సారమును వివరించు తిరువాయ్‌మొళి నూఱ్ఱన్దాది అను** తమిళ ప్రబంధమునకు వ్యాఖ్య



6. **ఆర్తిప్రబంధవ్యాఖ్య :-** శ్రీవరవరమునులచే ప్రణీతమైన, భగవద్రామానుజ స్తుతిపరమైన తమిళ ప్రబంధమునకు వ్యాఖ్య

7. **సప్తగాథ వ్యాఖ్య :-** విళాఞ్జోలైప్పిళ్లై అను ఆచార్యులు పిళ్లైలోకాచార్యులవారి విషయమున రచించిన ఏడు పాశురములతో కూడిన లఘుకృతికి వ్యాఖ్య

8. **అర్థపంచక వ్యాఖ్య :-** శ్రీపిళ్లైలోకాచార్యులవారి 18 రహస్య గ్రంథములలో ఒకటి అగు అర్థపంచకమను గ్రంథముపై వ్యాఖ్య

9. **అరుమ్బదవిళక్కమ్ :-** ముముక్షుప్పడి రహస్య గ్రంథసూత్రములపై శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యను గూర్చి రచింపబడిన టిప్పణి.

10. **తిరుప్పావైఅరుమ్బదమ్ :-** ఈ కృతి ప్రస్తుతము లభించుటలేదు.

11. **నాలాయిర దివ్యప్రబంధతనియన్‌ల వ్యాఖ్య :-** శ్రీ శైలేశేత్యాది నాలాయిరదివ్య ప్రబంధ తనియన్ శ్లోకముల, పాశురముల వ్యాఖ్య.

12. **శ్రీవైష్ణవ సమయాచారనిష్కర్ష :-** శ్రీవైష్ణవసంప్రదాయ వివరమును సశాస్త్రీయముగా తెలుపు కృతి.

13. **యతిరాజవింశతి వ్యాఖ్య :-** భగవద్రామానుజులను గూర్చి స్తుతించుచు శ్రీవరవరమునులు సాయించిన 20 శ్లోకములతో కూడిన స్తోత్రమునకు వ్యాఖ్య.

14. **శెయ్యతామరైత్తాళిణైవ్యాఖ్య :-** తమ ఆచార్యులగు శ్రీవరవరమునులను మంగళాశాసన మొనర్చుచు ప్రతివాదిభయంకరం అణ్ణన్ చేసిన పాశురముపై వ్యాఖ్య .ఇవియే కాక లోకాచార్య పంచాశత్ అను 50 శ్లోకములతో కూడిన, పిళ్లైలోకాచార్యులవారిని స్తుతించు ఈకృతిని పిళ్లైలోకమ్‌జీయర్ రచించిరని కొందరు అందురు

15. **వాక్యగురుపరంపరా వ్యాఖ్య :- " అస్మద్గురుభ్యో నమః"** అనిప్రారంభమగు, నిత్యానుసంధేయమగు వాక్య గురుపరంపరపై వ్యాఖ్య.

శ్రీపిళ్లైలోకమ్ జీయర్ తమ కృతులను శ్రీరంగములోని శ్రీరంగనాథుని సన్నిధిలో నివేదించి, ఆభగవానుని కృపకు పాత్రులయ్యిరి.పిళ్లైలోకాచార్యులవారి ఆరాధనలోని అర్చామూర్తి అగు శ్రీరంగనాథుని వీరు తమ ఆరాధనమూర్తిగా పొందిరని పెద్దలందురు. శ్రీరంగమునుండి తమకుమారులగు అళకియమణవాళన్‌తోపాటు (వీరికే పిళ్లైజీయర్

అనియు పేరు) కాంచీనగరమును చేరి, అచట శిష్యులకు శ్రీభాష్య, భగవద్విషయాది-గ్రంథములను ప్రవచనము చేయుచుండిరి. ఆసమయమున విజయనగరప్రభువు వీరిని ఆశ్రయించి, శిష్యుడయ్యెను.

**"తిరుక్కడల్ మల్లై"** అనుదివ్యదేశములో వేంచేసియుండు భగవానుడు విజయనగరప్రభువునకు కలలో కన్పించి, తన ఆలయము సముద్రములో మునిగినదని, దానిని పునరుద్దరణ కావింపవలసినదని కోరెనట. అపుడు ఆప్రభువు తమ ఆచార్యులగు పిళ్లైలోకమ్‌జీయర్‌ను పురస్కరించుకొని ఆ సత్కార్యమును నెఱవేర్చెను. పిమ్మట చైత్రమాసము పునర్వసు నక్షత్రములో ధ్వజారోహణము - విశాఖ నక్షత్రములో ధ్వజావరోహణములు జరుగునట్లు బ్రహ్మోత్సవముగావించెను. ఆ క్షేత్రములో తమ ఆచార్యులగు పిళ్లైలోకమ్‌జీయర్‌కు మొదటి తీర్థము,అరుళప్పాడు, పరివట్టమ్, తిరుమాలై ఇత్యాదిమర్యాదలు జరుగునట్లు చేసి, అది నిత్యముగా వీరికి, వారి వంశీయులకు జరుగునట్లు తామ్రశాసనము వ్రాయించెను. దాని ప్రకారము ఈనాటికిని పిళ్లైలోకమ్‌జీయర్ వంశస్థులు ఆ ఆలయములో మర్యాదలను పొందుచున్నారు. భగవద్రామానుజులయందు అత్యంతప్రావీణ్యమునుకల శ్రీవరవరమునులను యతీంద్రప్రవణులనుట తగినట్లే, శ్రీవరవరమునులపట్ల మిక్కిలి ప్రావణ్యమును కల వీరిని యతీంద్రప్రవణప్రవణు లనుట తగినదికదా ! వీరు సాక్షాత్తు వరవరమునుల అపరావతారము అనుటను **"కాంతోపయంతృయమినో జగదార్యయోగీ... యం భూతలే నిగమశీర్షవిదో వదంతి కాంతోపయంతృయమినోఽవతరం ద్వితీయమ్"** అను సూక్తి తెలుపుచున్నది.

**శ్రీరామానుజదేశికేంద్రవిజయ శ్రీమద్ధ్వజశ్రీరితి**
**ప్రఖ్యాత స్సకలశ్రుతిస్మృతివిదా మాద్య స్తదీయోత్తమః।**
**సోఽయం శ్రీపరవస్తుగార్భ్యశఠజిత్‌గుర్వంఘ్రిపద్మాశ్రితః**
**శ్రీలోకార్యమునీశ్వరో విజయతామ్ స్వాకారసంపత్క్రియః**

**కులనాద నెజ్గళ్ మణవాళయోగి గుణక్కడలై**
**ప్పులనాళు మణ్డి ప్పరుకి క్కళిత్తిన్ద ప్పారినుళ్లే**
**ఉలకారియమునిమేగమ్ మున్నాళెన్నుళ్ల ఙ్కుళిర**
**నలమాన నీర్‌మழை నాళుమ్ పొழியు మిన్నానిలత్తే**



**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ అనుగ్రహించిన**

# శెయ్యతామరైత్తాళిణైవ్యాఖ్యానమ్

**శెయ్యతామరైత్తాళిణై వాழியే శేలై వాழி తిరునాబి వాழியే ।**
**తుయ్యమార్బుమ్ పురినూలుమ్ వాழியే శున్దరత్తిరుత్తోళిణై వాழியే ।**
**కైయుమేన్దియ ముక్కోలుమ్ వాழியే కరుణైపొజ్గియ కణ్ణిణై వాழியే ।**
**పొయ్యిలాద మణవాళమాముని పున్ది వాழி పుకழ் వాழி వాழியే ।**

**శ్రీమతే రమ్యజామాతృమునయే విదధే నమః ।**
**యత్స్మృతిః సర్వసిద్ధీనా మంతరాయనివారిణీ ॥**

"[1]శ్రీశైలేశదయాపాత్ర" మెన్ఱు తొడజ్గి అరుళిచ్చెయ్‌ద సేనైముదలియార్‌నాయనార్ జీయరుడైయ కల్యాణగుణజ్గళిలే తోழ்ఱు అడిమైపుక్కపడియై ప్రకాశిక్కిప్పిఱారాయ్-

## శెయ్యతామరైత్తాళిణైవ్యాఖ్యానము - ఆంధ్రానువాదము

**శెయ్యతామరైత్తాళిణై వాழியే శేలై వాழி తిరునాబి వాழியే ।**
**తుయ్యమార్బుమ్ పురినూలుమ్ వాழியే శున్దరత్తిరుత్తోళిణై వాழியే ।**
**కైయుమేన్దియ ముక్కోలుమ్ వాழியే కరుణైపొజ్గియ కణ్ణిణై వాழியే ।**
**పొయ్యిలాద మణవాళమాముని పున్ది వాழி పుకழ் వాழி వాழியే ।**

**శ్రీమతే రమ్యజామాతృమునయే విదధే నమః ।**
**యత్స్మృతిః సర్వసిద్ధీనా మంతరాయనివారిణీ ॥**

ఎవరి స్మరణము సకలకార్యసిద్ధులలో కలుగు ఆటంకములను నివారించునో అట్టి, కైంకర్యలక్ష్మిని కల్గిన శ్రీరమ్యజామాతృమునికి నమస్కారమును చేయుచున్నాను.

శ్రీరంగమున ఒక సంవత్సరకాలముపాటు శ్రీరంగనాథుడు శ్రీమణవాళమహాము నులవలన భగవద్విషయము - ఈడు అను తిరువాయ్‌మొழி దివ్యప్రబంధ వ్యాఖ్యానమును ఆలకించెను. పిమ్మట శ్రీరంగనాథుడు శ్రీమణవాళమహామునుల శుభగుణములచే

1. మణవాళమహాముని ప్రార్థనాశ్లోకము (ముక్తకము)

నిన్ఱార్. అవర్తమ్మడియరాన ఇవరుమ్ అగ్గుణజ్గళుక్కుమ్, సౌన్దర్యాదికళుక్కుమ్ ఆశ్రయమాన దివ్యమజ్గళవిగ్రహత్తిలే ఈడుపట్టు, పాదాదికేశాంతమాక అనుభవిత్తు,తమ్ముడైయ పరివిన్ మికుతియాలే మజ్గళాశాసనమ్ పణ్ణినపడియై అడైవే అరుళిచ్చెయ్‌కిఱార్ ఇతిల్. "[2]శెయ్యతామరై పాడిన శీరణ్ణన్"ఎన్ఱిరే ఇవర్క్కు నిరూపకమ్. ఇప్పడి మజ్గళాశాసనమ్ పణ్ణుకిఱవర్ తమ్ముడైయ శేషత్వానుగుణమాక "[3]ఉన్ పొన్నడి వాఴ్క" ఎన్నుమాపోలే "[4]పొన్నడియామ్ శెజ్గమలప్పోదుకళుక్కు" మున్దుఱ మజ్గళాశాసనమ్ పణ్ణుకైయిలే ప్రవృత్తరాకిఱార్.

---

ఆకర్షింపబడినవాడై, వారికి శిష్యుడయ్యెను. శిష్యకృత్యముగా రంగనాథ స్వామి శ్రీమణవాళమహాముునుల వైభవమును కీర్తించుచు **"శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్, యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్"** అను శ్లోకమును చివరిదినమున సభలో విజ్ఞాపన చేసెను. ఆ విధముగానే శ్రీమణవాళమహామునుల శిష్యులలో ఒకరు అగు శ్రీప్రతివాదిభయంకరం అణ్ణన్ అను ఆచార్యులు వారి (మణవాళమహామునుల) గుణములకు జితులై, ధీభక్త్యాదిగుణములకును, సౌందర్యాదులకును ఆశ్రయమగు దివ్యమంగళరూపమున మిక్కిలి అభినివేశమును కల్గినవారై, ఆ రూపమును పాదాదికేశాంతముగా సేవించి, ఆ రూపమునకు ఎట్టి లోపము కలుగరాదను అతిశయించిన భక్తి భావముతో మంగళాశాసనమును ఒక పాశుర రూపమున అనుగ్రహించిరి. ఆ పాశురమే **"శెయ్యతామరై త్తాళిణై"** అని ప్రారంభమగు పాశురము. కావుననే వీరికి (ప్రతివాది భయంకరం అణ్ణన్‌కు) **"శెయ్యతామరై పాడిన శీరణ్ణన్" (శెయ్యతామరై** అను మణవాళమహామునుల మంగళాశాసనమును పాడిన కైంకర్యసమృద్ధిని కల్గిన అణ్ణన్) అను పేరు ప్రసిద్ధి చెందినది. వీరు ఇట్లు చేయు మంగళాశాసనమును తమ శేషత్వమను స్వరూపమునకు అనుగుణముగా పాదములనుండి ప్రారంభించుచున్నారు. **"ఉన్ పొన్నడి వాఴ్క"** అని పెరియాఴ్వార్లు భగవానుని సువర్ణపాదములకు మంగళమును పాడినట్లు, అణ్ణన్ **"పొన్నడియామ్ శెజ్గమలప్పోదు"** (బంగారమువలె స్పృహణీయములైన - అందమైనవగు ఎఱ్ఱని కమలముల జంట) అని ప్రసిద్ధి చెందిన శ్రీమణవాళమహామునుల పాదపద్మములకు మంగళమును ముందుగా పల్కుచున్నారు.

---

2. ప్రతివాదిభయంకరం అణ్ణన్‌వాఴ్‌త్తిరునామము
3. పెరియాఴ్వార్‌తిరుమొఴి 5.2.8
4. ఉపదేశరత్తినమాలై



**(శెయ్యతామరై త్తాళిణై వాఴియే)** ప్రజై మునైయిలే వాయ్‌వైక్కుమ్ "[5]నాణ్‌మలరామ్ అడిత్తామరై" ఇవైయాయ్‌ఱు. "[6]ఉన్ ఇణైత్తామరైకట్కు అన్బురుకి నిఱ్కుమదు" ఎన్గిఱపడియే ఇదువుమ్ స్వరూపమాయిరుక్కుమ్. "[7]ఇన్బుఱుమ్ తొణ్డర్ శేవడి యేఱ్ఱి వాఴ్‌త్తు"కైయితే నిలైనిన్ఱ స్వరూపమ్.

(శెయ్యతామరై త్తాళిణై వాఴియే) - ఇవర్ "[8]అడియైత్ తొడరుమ్పడి" రాగసౌమనస్యపదసౌభాగ్యజ్గళ్ ఉణ్డాయిఱు. అదావదు, అఴకియదాయ్, శివన్ద శెవ్వి త్తామరైప్పూప్పోలే దర్శనీయముమాయ్, భోగ్యముమాయ్,తామరైప్పూవై నిఱైత్తువైత్తాప్పోలే శేర్త్తియఴకైయుమ్ ఉడైత్తాయ్, ఉపాయపూర్త్తియైయుమ్ ఉడైత్తాయ్‌త్తు త్తిరువడిగళిరుప్పదు.

---

**(శెయ్యతామరైత్తాళిణై వాఴియే)** - శిశువు తల్లి స్తన్యమును సహజముగా ధారకముగా తలచి, నోటిలో పెట్టుకొనునట్లే, వీరును (అణ్ణన్) **"నాణ్‌మలరామ్ అడిత్తామరై"** అనునట్లు అపుడే వికసించిన పూవువలె సుకుమారములైన మణవాళ మహామునుల పాదపద్మములను ధారకముగా తలచి, వానిని స్తుతించుచున్నారు. (**"వాయ్‌వైక్కుమ్"** అను తమిళ ప్రయోగము శ్లిష్టము. నోటిలో పెట్టుకొనుట, స్తుతించుట అను రెండర్థములు ఈ ప్రయోగము వలన స్ఫురించును). **"ఉన్ ఇణైత్తామరైకట్కు అన్బురుకి నిఱ్కుమదు"** (నీ చరణారవింద యుగము నందు ప్రేమ (భక్తి) వలన ద్రవించి నిలచుట అనునది) అను విధముగా భగవానుని పాదముల విషయము నిరవధికమైన ప్రేమను కల్గియుండుట ప్రపన్నుని స్వరూపమగునట్లే, ఆచార్యుల చరణములయందు ప్రేమను కల్గి, వానికి మంగళమును పాడుటయు ప్రపన్నుని స్వరూపములోనికి చేరును. **"ఇన్బుఱుమ్ తొణ్డర్‌శేవడి యేఱ్ఱివాఴ్‌త్తుమ్"** (భగవానుని నామమును కీర్తించి, నిరతిశయమైన ఆనందమును పొందు భక్తుల అందమైన పాదములను స్తుతించి, మంగళమును నా మనస్సు పాడును) అని కులశేఖరులు పల్కిన విధముగా భగవత్ భక్తులకు మంగళమును ఆశాసించుటయే కదా స్థిరమైన స్వరూపము (అనగా చరమపర్వము).

(శెయ్యతామరై త్తాళిణై వాఴియే) **"శెయ్య"** అనుటకు ఎఱ్ఱని, అందమైన, గొప్ప మొదలగు పలు అర్థములు కలవు. **"ఇణై"** అను పదము ద్వంద్వ వాచకమగుటచే సారూప్యమును తెలుపును. **"తామరై"** అనుటచే భోగ్యత, సౌమనస్యములు తెలుపబడినవి. **"తాళ్"** అను పదము చరణమును బోధించునది అగుటచే ఉపాయమగుటను తెలుపును. కావున **"శెయ్య**

---

5. తిరువాయ్‌మొఴి -3.3.9
6. తిరువాయ్‌మొఴి 7.1.10
7. పెరుమాళ్‌తిరుమొఴి 2.4.5
8. ఇరామానుశనూఱ్ఱన్దాది. 63

"[9]ఉన్మీలత్పద్మగర్భే"త్యాది."[10]పోదచ్చివన్దు పరిమళమ్ వీశి, పుదుక్కణిత్త శీదక్కమలత్తై నీరేఱ వాట్టి" ఎన్నుమ్, "[11]శీరారుమ్ శెజ్ఞమలత్తిరువడిగళ్ వాÇయే"ఎన్నుమిఱే అడియఱివార్ వార్తై. ఇప్పడి ఇదినుడైయ సౌన్దర్యత్తైయుమ్, భోగ్యతాప్రకర్షత్తైయుమ్ అనుభవిత్త ఇవర్ మజ్ఞళాశాసనమ్ పణ్ణియల్లదు నిఱ్కమాట్టారే –"[12]ఉన్‌శేవడి శెవ్వి తిరుక్కాప్పు" ఎన్నుమాపోలే.

అన్డియే, "శెయ్య" ఎన్గిఱిత్తాల్ తిరువడిగళుడైయ శెవ్వియై చ్చొల్లిØÓయ్, ఆశ్రితరళవుమ్ వన్దు శెల్లుకిఱ వాత్సల్యత్తైయుడైత్తు ఎన్గై. ఇదు అణ్ణరాయచక్రవర్తిక్కు ప్రత్యక్షమ్.

**తామరైత్తాళిణై వాÇయే"** అనుటకు అందమైన ఎఱ్ఱని రంగును కల్గిన, చక్కగా పూచిన తామరపూల జంటవలె చూడతగినదియై, భోగ్యములై, పరస్పర సాదృశ్యమువలన ఏర్పడిన సౌందర్యమును కల్గినదియై, ఉపాయపూర్తిని కల్గిన పాదద్వంద్వమని తాత్పర్యము. ఇట్లు కవి నమస్కరించుటకు తగిన రాగ (ఎఱ్ఱనితనము – అనురాగము), సౌమనస్య (సువాసన – మంచి హృదయము) సౌభ్రాత్రములను (సారూప్యమును, ఒకే మూలమును కల్గియుండుటను) శ్రీమణవాళమహామునుల చరణద్వంద్వము కల్గియున్నది. ఇందుల కనుగుణముగా పూర్వదినచర్య అను స్తోత్రములోని **"ఉన్మీలత్పద్మగర్భ .... దివ్యం తత్పాదయుగ్మమ్"** (వికసించిన తామరపూవుల గర్భముయొక్క ఎఱ్ఱని కాంతివంటి కాంతిని అడుగున కల్గిన దివ్యములగు మణవాళమహామునుల పాదయుగ్మము) అను మొదలగు ప్రమాణములు అనుసంధింపతగినవి. శ్రీమణవాళమహామునుల చరణములను (వాని స్వభావమును మూలమును) తెలిసినవారును **"పోదచ్చివన్దు, పరిమళమ్ వీశి, పుదుక్కణిత్త శీదక్కమలత్తై నీరేఱ వాట్టి"** (మిక్కిలి ఎఱ్ఱనిదై, పరిమళమును వెదజల్లునదియై, నూతనమై, చల్లనిదైన కమలమును జయించి) అని, **"శీరారుమ్ శెజ్ఞమలత్తిరువడిగళ్ వాÇయే"** (సౌందర్యము నిండిన, ఎఱ్ఱని కమలములవంటి పాదములు వర్ధిల్లుగాక) అని వానియొక్క రాగమును, సౌమనస్యమును, నూతనత్వమును, సొబగును వర్ణించిరి కదా! **"ఉన్‌శేవడి శెవ్వి తిరుక్కాప్పు"** అని పెరియాÇ్వార్లు భగవానుని ఎఱ్ఱని, అందమైన పాదములకు మంగళము పల్కినట్లు మామునులపాదముల సౌందర్యమును, గొప్ప భోగ్యతను దర్శించిన అణ్ణన్ వానికి మంగళాశాసనమును చేయకుండ నుండలేరు కదా!

లేక, **"శెయ్య"** అను పదమునకు ఋజుత్వమును కల్గియుండుటను తెలుపునని భావించినచో, ఆశ్రితులను అనుగ్రహించు వాత్సల్యమును పాదములు కల్గియుండుటను ఈ విశేషణము తెలుపును. ఈ ఋజుత్వము అణ్ణరాయచక్రవర్తి విషయమున అనుభూతము.

9. ఉత్తరదినచర్యా – 5
10. పాదాదికేశమాలై – 1
11. ?
12. తిరుప్పల్లాణ్డు – 1



ముదలడియిలేయిఱే ఎÇన్దు,రక్షిత్తు, అరుళిØÓ. "[13]వన్దరుళి ఎన్నై ఎడుత్త మలర్‌త్తాళ్‌కళ్ వాÇయే"ఎన్గిఱపడియే తమ్మైయుమ్ మున్దుఱ విషయీకరిత్తదు తిరువడిగళాయిØÓ. "[14]తిరుక్కమలపాదవ్ వన్దు", "[15]అడియేనై అజ్జే వన్దు తాఞ్గు తామరైయన్న పొన్నారడి"ఎన్నక్కడవదిఱే. ఇవరిప్పడి తమ్మై విషయీకరిత్త శెయ్యతామరై త్తాళ్‌కళై క్కొణ్డు

(యతీంద్ర ప్రవణప్రభావమున ఈ వృత్తాంతము వర్ణింపబడినది. అణ్ణరాయచక్రవర్తి తిరుమలైనల్లాన్ వంశమునకు చెందినవారు. ఈ వంశము భగవద్రామానుజులచే అభిమానింపబడినది. అణ్ణరాయచక్రవర్తి శ్రీవైష్ణవమతప్రచారకులైయుండిరి. ఒక పర్యాయము ఆ చక్రవర్తి సకుటుంబముగా శ్రీరంగనాథుని సేవించుటకై శ్రీరంగమునకు వచ్చిరి. అప్పటికి శ్రీమణవాళ మహామునులు వార్ధకదశలో నుండిరి. అచటివారివలన ఆ మహనీయులను గూర్చి వినిన అణ్ణరాయచక్రవర్తి తల్లి, వారిని సేవింప ఆశపడెను. అణ్ణరాయ చక్రవర్తి అందఱిని పిలచుకొని శ్రీమణవాళ మహామునుల మఠమునకు పోయి, పట్టర్ పిరాన్ జీయర్ అను శిష్యుల ద్వారా, మణవాళమహామునులను చేరి, వారి పాదములకు సాష్టాంగ ప్రణామము లాచరించెను. అపుడు మణవాళ మహామునుల పాదములు తమకు తామే అణ్ణరాయ చక్రవర్తి శిరస్సును స్పృశించెను. ఇట్లు భక్తుల విషయమున మణవాళమహామునుల పాదములు చూపిన ఋజుత్వమును **'శెయ్య'** అను విశేషణము తెలుపుచున్నదని చెప్పవచ్చును). స్తుతికర్త (అగు అణ్ణన్) నుకూడ ముందుగా అనుగ్రహించినది మణవాళమహామునుల పాదములే. ఈ విషయమును వారే స్వయముగా మణవాళమహామునులనుగూర్చి తాము రచించిన వేరొక మంగళాశాసన పాశురమున **"వన్దరుళి ఎన్నై ఎడుత్త మలర్‌త్తాళ్‌గళ్ వాÇయే"** (నా వద్దకు వేంచేసి, నన్ను ఉద్ధరించిన, పూవువలె సుకుమారములైన పాదములు వర్ధిల్లుగాక) అనుచు తెలిపిరి కదా! కావున ఆ వృత్తాంతమును **'శెయ్య'** అను విశేషణము తెలుపుచున్నదనవచ్చును. **"తిరుక్కమల పాదమ్ వన్దు"** (శ్రీదేవి ప్రీతితో సేవించు కమలములవంటి పాదములు వచ్చి) అను తిరుప్పాణ్ శ్రీసూక్తి, **"అడియేనై అజ్జే వన్దు తాఞ్గు తామరైయన్న పొన్నారడి"** (అచటికి వచ్చి, భయపడవలదని పల్కి, దాసుని రక్షించిన తామరలవంటి పాదములు) అను తిరుమజ్జైమన్నన్ సూక్తియు ఇచట స్మరింపనగును. వీరు భగవానుని విషయమున అనుసంధించిన భావమును అణ్ణన్ తమ ఆచార్యుల విషయమున ప్రకటించిరి. తమను అవ్యాజముగా అనుగ్రహించిన ఎఱ్ఱని తామరలవంటి పాదములను "నేనే స్వయముగా నా

13. మణవాళమాముని వాÇ్తిరునామము
14. అమలనాదిపిరాన్ –1
15. పెరియ తిరుమొÇ –7.3.5

“[16]శెన్నిత్తరిక్కు మళవాయిరుక్కిఱ పొఱ్కాలానదు నమ్ శెన్నిత్తిడరిలే ఏఱుమ్బడి అరుళాలే వైత్తరుళువదే” ఎన్ను అవØÓినుడైయ పావనత్వ-భోగత్వఙ్గళై యనుభవిత్తు, అవత్తుక్కు త్తమ్మోట్టై సమ్బన్ధత్తాలే ఓర్ అవద్యముమ్ వారాదొÇియ వేణుమ్ ఎన్ను మఙ్గళాశాసనమ్ పణ్ణుకిఱారాకవుమామ్. ఆకైయాల్ ఇవర్క్కు ప్రాప్యప్రాపకఙ్గళ్ ఇరణ్డుమ్ అడి తానేయాయిరుక్కై.

**(శేలై వాÇి)** – ఇని, ఇత్తిరువడిగళుక్కు ఇవ్వరుకు గన్తవ్యభూమి యిల్లామైయాలే (మేలే) తిరువరైయోడే శేర్న్దు, శివన్దు నిఱ్పదాన తిరుప్పరివట్టత్తిలÇకిలే శెన్ను అచ్చేర్త్తిక్కు మఙ్గళత్తై ఆశాసిక్కిఱార్ “శేలైవాÇి” “ఎన్ను. కాల్వాశియిలే నిల్లానుల్ అరైవాశి తేడుమవరిఱే.

---

తలపై దాల్చతగిన ,అందమైన పాదములు తామే నా శిరస్సును అధిరోహించుటయా! ఇట్లు నన్ను అనుగ్రహించుటయా!” అని తలచుచు, వానియొక్క పావనత్వమును, భోగ్యత్వమును (తామరై అను పదముయొక్క స్వారస్యమును) అనుభవించి, వానికి తమ సంబంధమువలన ఎట్టి దోషము కలుగకుండవలెననుచు మంగళమును చేయుచున్నారనియు చెప్పవచ్చును. **“శెయ్య, తామరై”** అను పదములు రెండును ప్రాప్యత్వమును, చరణమను అర్థమిచ్చు **“తాళ్”** అను పదము ప్రాపకత్వమును సూచించుటచే, వీరికి ప్రాప్యప్రాపకములు రెండును శ్రీమణవాళమహామునుల పాదములే అయినవి.

**(శేలై వాÇి)** – శ్రీపాదములకు క్రింద దర్శింపతగినవి ఏమియు లేకుండుటచే, ఇక క్రమముగా దివ్యమంగళరూపము పైభాగములోని సొబగును కవి వర్ణించుచున్నారు. నడుమునకు తగినదియై, ఎఱ్ఱని రంగును కల్గినదైన కాషాయవస్త్రముయొక్క సౌందర్యమును దర్శించి, ఆ రెండిటియొక్క సౌసాదృశ్యమునకు మంగళమును **“శేలై వాÇి”** (వస్త్రము వర్ధిల్లుగాక) అనుచు అణ్ణన్ పల్కుచున్నారు. **“శేలై”** అను పదము **“చేల”** అను సంస్కృతపదముయొక్క వికృతి. వస్త్రము అని దీని అర్థము. అణ్ణన్ కేవలము పాదముల అందమును దర్శించినంతమాత్రమున తృప్తిపడువారు కాదు కదా! కావున నడుము, ఆ ప్రదేశమును అలంకరించు కాషాయాంబరముల చేరికను, దాని వలనకల్గిన శోభను దర్శించి,వానికి మంగళమును పల్కుచున్నారు.ఇచట **“కాల్వాశియిలే నిల్లామల్ అరైవాశి తేడుమవరిఱే”** అను తమిళ వ్యాఖ్యానసూక్తి స్వారస్యము గమనింపతగినది. **“కాల్”** అను పదమునకు పాదము అని, నాల్గవ భాగము అని, **“అరై”** అను పదమునకు నడుము అని, సగభాగము అని

---

16. ఆర్తి ప్రబన్ధమ్ -30



“[17]తిరువరైయిల్ శాత్తియ శెన్దువరాడై వాÇి” ఎన్ను తిరువరైయిల్ ఉడైయÇకుమ్ పరభాగమాయిఱే యిరుప్పదు. చన్ద్రనై చ్చూÇన్ద పరివేషమ్పోలే యాయిØÓ త్తిరువరైక్కు త్తిరుప్పరివట్టత్తోడే శేర్త్తి. “[18]సుధానిధి మివ స్వైరస్వీకృతోదగ్రవిగ్రహమ్” ఎన్నక్కడవదిఱే.“[19]ఈనమిలాద ఇళఞాయిఱారుమ్ ఎÇిలుమ్ శెక్కర్వానముమొత్త తువరాడైయుమ్ “ఎన్నుమ్,“[20]ఆతామ్రవిమలామ్బరమ్”ఎన్నుమ్ అత్యాశ్చర్యమాయిఱే యిరుప్పదు.

---

రెండర్థములు కలవు. కావున నాల్గవభాగమును పొందుట ద్వారా తృప్తిపడని వీరు సగభాగమును పొందుటకు వెదకుదురు కదా అను వేరొక చమత్కారమైన అర్థమిచట హృదయంగమముగా స్ఫురించుచున్నది.) **“తిరువరైయిల్ శాత్తియ శెన్దువరాడై వాÇి”** (తెల్లని నడుమున ధరించిన ఎఱ్ఱని కాషాయ వస్త్రము వర్ధిల్లుగాక) అను శ్రీరామానుజుల మంగళాశాసనసూక్తి స్మరణీయము. తెల్లని రంగు కల్గిన నడుముపై ఎఱ్ఱని కాషాయ వస్త్రమును ధరించుట వలన కల్గిన భిన్న వర్ణముల కలయిక మిక్కిలి శోభాదాయకము. తెల్లని కాంతినికల చంద్రుని చుట్టును వలయముగా చుట్టుకొనియుండు ఎఱ్ఱని పరివేషమువలె నడుమును చుట్టియున్న కాషాయవస్త్రము శోభిల్లుచున్నది.( మణవాళ మహామునుల దేహకాంతి తెల్లనిది. వారు ఆదిశేషుల అవతారము). **“సుధానిధి మివ స్వైరస్వీకృతోదగ్ర విగ్రహమ్”** (స్వయముగా) స్వీకరించిన, గొప్ప రూపమునుకల చంద్రునివలె అను పూర్వదినచర్యలోని సూక్తివలన శ్రీమణవాళమహామునుల రూపము చంద్రుని వంటిదని తెలియుచున్నది కదా! **“ఈనమిలాద ఇళఞాయిఱారుమ్ ఎÇిలుమ్ శెక్కర్ వానముమొత్త తువరాడైయుమ్”** (న్యూనతలేని, లేబ్రాయముతో వెలుగొందు రమ్యమైన జఘన ప్రదేశము, ప్రకాశించు ఎఱ్ఱని ఆకాశమువలె (మేఘమువలె) నున్న కాషాయవస్త్రము), అనుచు ప్రస్తుతస్తుతికర్త మణవాళమహామునుల విషయమున నుడివిన **“అమలనాదిపిరాన్”** అను ప్రబంధములోని సూక్తినిబట్టి, **“ఆతామ్రవిమలామ్బరమ్”** (ఎఱ్ఱని దోషరహితమైన వస్త్రమును కలవారిని) అను పూర్వదినచర్యలోని సూక్తిని బట్టియు నడుమునకు అలంకరింపబడిన వస్త్రముయొక్క శోభ మిక్కిలి ఆశ్చర్యకరముగా నుండును అని తెలియుచున్నది. దీనివలన **“పీతకవాడైపిరానార్ పిరమగురువాకి”** (పీతాంబరధారియగు ప్రభువు పరమాచార్యులై) అను పెరియాÇ్వార్లు

---

17. శ్రీరామానుజ వాÇిత్తిరునామము
18. - పూర్వదినచర్యా -3
19. పాదాదికేశమాలై -3
20. -పూర్వదినచర్యా-5

